# తెలుగు రచన

( వాక్య, లేఖా, వ్యాసములు )

కూర్పరి

డా॥ కె. వి. సుందరాచార్యులు






ఆంధ్ర సారస్వత పరిషత్తు

తిలక్ రోడ్, హైదరాబాదు-500 001

# తెలుగు రచన

(వాక్య, లేఖా, వ్యాసములు)



కూర్పరి :
డా॥ కె. వి. సుందరాచార్యులు




ఆంధ్ర సారస్వత పరిషత్తు
తిలక్‌రోడ్, హైదరాబాదు-500 001

ఆంధ్ర సారస్వత పరిషత్తువారు 'ప్రవేశ' పరీక్షకుగాను వాక్య, లేఖా, వ్యాస రచనలను గూర్చిన పుస్తకాన్ని సిద్ధపరచ వలసిందని నన్ను ఆదేశించిరి. తెలుగు రచన ఆరంభదశలో ఉన్నవారికి, తెలుగు మాతృ భాష కాని వారికి ఉపయోగపడే విధంగా ఆధునిక రచనాభాషలో వ్రాయ డం మంచిదని పరిషత్తు కార్యదర్శిగారు సూచించారు. కాబట్టి ఈ పుస్త కాన్ని సాధ్యమైనంత సరళంగా రాయటం జరిగింది. వాక్యరచనభాగా నికి డా॥ చేకూరి రామారావుగారి 'తెలుగువాక్యం', లేఖారచన భాగానికి శ్రీ కేశవపంతుల నరసింహశాస్త్రిగారి 'లేఖావళి' తోడ్పడ్డాయి. వారికి నా ధన్యవాదాలు. ఈ అవకాశాన్నిచ్చిన ఆంధ్రసారస్వత పరిషత్తువారికి కృతజ్ఞతలు.

భవదీయుడు

కె. వి. సుందరాచార్యులు

# వాక్య రచన

మన అభిప్రాయాన్ని ఎదుటివారికి తెలియజేయడానికి మనం ఉప యోగించే మాటగాని, కొన్ని మాటల సమూహంగాని 'వాక్యం' అంటారు. ఉదాహరణకు 'రా' అంటే 'ఇటు రమ్మ'ని 'పో' అంటే 'అటు పొమ్మ'ని అర్థం చేసుకుంటాము. 'చూడు' అనే మాటకు 'దీనిని చూడు' అని అర్థ మవుతుంది. వీటిల్లో ఉన్నమాట ఒకటే అయినా అవి సంపూర్ణ వాక్యా ర్థాన్ని ఇస్తున్నాయి. అట్లే 'ఈ పుస్తకాన్ని తీసుకో', 'ఆయన బడికి వెళ్తు న్నాడు' మొదలైనవి ఒకటి కంటే ఎక్కువ మాటలున్న వాక్యాలు. భాషలో వాక్యమే ప్రధానమైన అంశం.

వాక్యాలు సామాన్య, సంశ్లిష్ట, సంయుక్త వాక్యాలని మూడు రకాలు. ఒక వాక్యంలో ఇంకొక వాక్యాన్ని చేరిస్తే సంశ్లిష్ట వాక్యం. ఒక వాక్యంతో ఇంకొక వాక్యాన్ని చేరిస్తే సంయుక్త వాక్యం.

సామాన్య వాక్యాలు : సామాన్య వాక్యాల్లో సాధారణమైన వాక్యాన్ని నిశ్చయార్థక వాక్యం అంటారు. ఇవి క్రియా రహితాలని, క్రియా సహి తాలని రెండు రకాలు.

క్రియారహిత వాక్యాలు : సమాపక క్రియ లేకుండా నామవాచకం తోనే పూర్తి అయ్యే వాక్యాలు క్రియారహిత వాక్యాలు. అంటే ఇట్లాంటి వాక్యాలలో రెండునామాలు ఉంటవి. మొదటి నామాన్ని 'ఉద్దేశ్యం' అని, రెండవ నామాన్ని 'విధేయం' అని అంటారు. క్రియారహిత వాక్యాలకు ఈ క్రిందివి ఉదాహరణలు :-

ఆమె సరళ

ఆ అమ్మాయి సినిమానటి

ఆయన లెక్చరరు

ఆ పిల్లవాడు మంచివాడు

ఆ బావి లోతు

ఆ అబ్బాయి పొడుగు

ఈమె నాకు చెల్లెలు

క్రియారహిత వాక్యాలలో మధ్యమ, ఉత్తమ పురుషభేదాలు కూడా ఉంటాయి. ఇవి ముఖ్యంగా విధేయనామంలో సూచింపబడతాయి.

నువ్వు విద్యార్థివి

నేను విద్యార్థిని

మేము విద్యార్థులము

క్రియాసహిత వాక్యాలు : సమాపక క్రియతో పూర్తి అయ్యేవాక్యాలు క్రియా సహిత వాక్యాలు.

అకర్మక, సకర్మక వాక్యాలు: క్రియలు అకర్మకాలని, సకర్మకాలని రెండు రకాలు. కర్మతో అవసరంలేని క్రియలు అకర్మకక్రియలు. కర్మతో అవసరం ఉండే క్రియలు సకర్మక క్రియలు. ఉండు, అగు, వచ్చు అకర్మక క్రియలు. చేయు, తిను, వ్రాయు మొదలైనవి సకర్మక క్రియలు.

అకర్మక క్రియతో పూర్తి అయ్యే వాక్యాలు అకర్మక వాక్యాలు.

ఉదా : రామయ్య ఉన్నాడు

రంగడు వస్తున్నాడు

రమ ఆగింది

సకర్మక క్రియతో పూర్తి అయ్యే వాక్యాలు సకర్మక వాక్యాలు.

ఉదా : సర్సయ్య అన్నం తింటున్నాడు
సీత రొట్టెలు చేసింది
రాముడు గోపిని కొట్టాడు

పదక్రమం : తెలుగు వాక్యంలో పదాలు ముఖ్యంగా కర్త-కర్మ-క్రియ క్రమంలో ఉంటాయి. ఉదాహరణకు గోపి అన్నం తిన్నాడు. అనే వాక్యంలో గోపి కర్త, అన్నం కర్మ, తిన్నాడు క్రియ. ఒక వాక్యంలో కర్మలు రెండు ఉండవచ్చు. ఒకటి ముఖ్యకర్మ, రెండవది అముఖ్యకర్మ. అముఖ్యకర్మ ముఖ్యకర్మ కంటే ముందు ఉంటుంది. 'అక్కడ' 'గుంటూరు'లో వంటి స్థలబోధకాలు అముఖ్యకర్మ కంటే ముందు, 'అప్పుడు' 'ఉదయం' వంటి కాలబోధకాలు అంత కంటే ముందూ వస్తాయి. క్రియా విశేషణాలు క్రియకు ముందు, కర్మకు సంబంధించిన విశేషణాలు కర్మకుముందు, కర్తృవిశేషణాలు కర్తకు ముందు వస్తాయి' ఉదాహరణకు కింది వాక్యాలు చూడండి.

'నేను నిన్న బెజవాడలో అందమైన అమ్మాయిని చూచాను.
గోపి రేపు మద్రాసులో రాముకు పుస్తకాలు ఇస్తాడు.'

పై వాక్యాలలో మొదటి వాక్యంలో 'నేను' కర్త, 'నిన్న' కాల వాచకం 'బెజవాడలో' స్థల వాచకం, 'అందమైన' అమ్మాయికి విశేషణం, 'అమ్మాయిని' కర్మ, చూచాను క్రియ. రెండవ వాక్యంలో 'గోపి' కర్త, 'రేపు, కాల వాచకం, 'మద్రాసులో' స్థల వాచకం, 'రాముకు' అముఖ్యకర్మ, 'పుస్తకాలు' ముఖ్యకర్మ, 'ఇస్తాడు' క్రియ.

**విధి, ప్రశ్నాదిక భేదాలు :** వాక్యాలలో విధి, ప్రశ్న, వ్యతిరేక, కర్మణి—మొదలైన భేదాలు ఎన్నో ఉన్నాయి.

విధి : విధ్యర్థక వాక్యాలలో మధ్యమ పురుష సర్వనామం కర్తగా ఉంటుంది. ఈ సర్వనామం ఏకవచనమైతే ధాతువే క్రియగా ఉంటుంది ; బహువచనమైతే ధాతువుకు అండి చేరుతుంది.

ఉదా : నువ్వు ఆ పుస్తకం చదువు
మీరు పని చేయండి

ప్రశ్న : ప్రశ్నార్థక వాక్యాలు ప్రధానంగా రెండు రకాలు. (1) 'ఆ' అనే ప్రశ్నార్థకం వాక్యం చివర చేర్చటం వల్ల ఇవి ఏర్పడతాయి. 'ఔను' 'కాదు' లేక 'లేదు' మొదలైన విధంగా ఏకపద సమాధానాలే ఈ ప్రశ్నలకు వస్తాయి. వాక్యంలోని క్రియ కూడ సమాధానం కావచ్చు. ఉదా : శీను అన్నం తిన్నాడా ? 'తిన్నాడు' అని కాని 'తినలేదు' అని కాని సమాధానం కావచ్చు.

(2) ఎవరు, ఎప్పుడు, ఎందుకు మొదలైన ప్రశ్నార్థక శబ్దాలతో రెండవ రకం ప్రశ్నార్థకా లేర్పడతాయి. ఈ ప్రశ్నలకు సమాధానం వాక్యంలో లేని పదాలు అయిఉంటాయి. ఉదా : నిన్న మీ ఇంటికి ఎవరు వచ్చారు ? 'మా టీచరు' మొదలైన విధంగా సమాధానాలు ఉంటాయి.

వ్యతిరేక : నిశ్చయార్థక వాక్యాలన్నిటినీ వ్యతిరేక వాక్యాలుగా మార్చవచ్చు. క్రియారహిత వాక్యాలకు విధేయ నామం తరువాత 'కాదు' లేక 'లేదు' చేర్చడం వల్ల వ్యతిరేక వాక్యాలు ఏర్పడుతాయి.

ఉదా : ఆయన మంచివాడు కాదు
ఆమె సరళ కాదు
బావి లోతు లేదు

క్రియాసహిత వాక్యాలలో సాధారణ క్రియల స్థానంలో వ్యతిరేక రూపాలను చేర్చినట్లయితే వ్యతిరేక వాక్యాలు ఏర్పడుతాయి.

ఉదా : శీను ఆ పుస్తకం చదువలేదు
రాము రోజూ స్నానం చేయడు
నిర్మల వంట చేయదు

నిషేధ : విధి వాక్యాలలో క్రియకు వద్దు చేర్చటం వలన నిషేధార్థక వాక్యాలు ఏర్పడుతాయి.

ఉదా : నువ్వు సినిమాకి వెళ్లవద్దు
మీరు ఆ నవల చదువవద్దు

కర్మణి : కర్మకు ప్రాధాన్యం ఉంటే కర్మణి వాక్యాలు, లేకపోతే కర్తరి వాక్యాలు.

ఉదా : కర్తరి : ఆయన మంచికథ వ్రాశాడు
కర్మణి : ఆయన చేత మంచికథ వ్రాయబడింది

అనుమతి : ధాతువుకు వచ్చు చేరిస్తే అనుమత్యర్థక వాక్యాలేర్పడతాయి.

ఉదా : అతడిని ఇంటికి వెళ్లనివ్వు

సంవిధి : తప్పనిసరి అనే అర్థంలో ధాతువుకు ప్రాచీన భాషలో వలయు వలెను, ఆధునిక భాషలో ఆలి, లేక ఆలె చేరుతుంది.

ఉదా : రాజు ప్రజలను కన్నబిడ్డల వలె చూడవలెను
నువ్వు బాగా చదవాలి

సంశ్లిష్ట వాక్యం : ప్రధాన వాక్యానికి ఉపవాక్యాన్ని చేర్చడం వలన సంశ్లిష్ట వాక్యం ఏర్పడుతుంది. ఉపవాక్యంలోని క్రియ అసమాపకంగా ఉంటుంది. ప్రధాన వాక్యంలోని క్రియ సమాపకంగా వుంటుంది. ఉప వాక్యాలలో సూచింపబడిన పని ప్రధాన వాక్యంలోని పనికంటే ముందు గాని, ఆ పనితో పాటుగాని చేసినదై ఉంటుంది.

ఉదా : విమల బడినుండి వచ్చి నిద్రపోయింది
సుమన్ అన్నంతిని ఆడుకొంటున్నాడు
సలిల స్నానం చేస్తూ పాట పాడుతుంది.

ఉపవాక్యంలోని క్రియ ప్రధాన వాక్యంలోని క్రియకు కారణం కూడా కావచ్చు.

ఉదా : శీను బాగా తిని బలిశాడు
శైలజ బాగా పరుగెత్తి అలసిపోయింది
మాలతి సరిగ్గా తినక చిక్కిపోయింది

సంయుక్త వాక్యాలు : కొన్ని వాక్యాలు కలసి ఒక వాక్యంగా ఏర్పడితే సంయుక్త వాక్యం అవుతుంది. ఇంగ్లీషులో and, or, but వంటి పదాలు రెండు వాక్యాలను కలుపుతాయి. తెలుగులో ఇంట్లాంటి పదాలు అవసరం లేకుండానే రెండు వాక్యాలు కలుస్తాయి.

ఉదా : లత తెలివైనది, సుజాత అందమైనది
మోహన్ అందమైనవాడు, తెలివైనవాడు

'కాని', 'లేదా' వంటి పదాలను చేర్చడం వలన కూడా తెలుగులో సంయుక్తవాక్యా లేర్పడుతాయి.

ఉదా : నువ్వయినా మా యింటికి రా, లేదా నేనయినా మీ యింటికి వస్తాను.
లత విశారద చదవాలనుకున్నది, కాని ఆమె భర్త ఒప్పుకోలేదు

# 'లేఖా రచన' గమనించ వలసిన విషయాలు

'లేఖా' రచనమంటే, మన సమాచారంగాని, మనకు సంబంధించిన విషయాన్ని కాని మరోచోట నున్నవారికి వ్రాసిపంపే విధాన మన్నమాట. ఇది సాధ్యమైనంత సంక్షిప్తంగా, సమగ్రంగా ఉండాలి. అందువల్ల ఈ క్రింది విషయాలు పాటించడం మంచిది.

1. మనం ఎక్కడినుండి వ్రాస్తున్నామో ఆ ఊరి పేరు, ఏరోజు వ్రాస్తున్నామో ఆ తేదీ లేఖకు పైన కుడివైపు వ్రాయాలి. లేఖ తీసుకున్నవాళ్లు వెంటనే ఎవరు వ్రాసింది తెలుసుకుంటారు.

2. ఎడమవైపు ఎవరికి వ్రాస్తున్నామో, వారిని సంబోధిస్తూ లేఖను ఆరంభించాలి. పెద్దవాళ్ళకైతే శ్రీ, పూజ్యులు, మహారాజశ్రీ మొదలైన విశేషణాలు, చిన్నవాళ్ళకైతే చిరంజీవి అనే విశేషణం వ్రాసి బంధుత్వాన్ని సూచించే పదంతో సంబోధించాలి.

   అపరిచితులూ, క్రొత్తవాళ్ళు అయితే 'శ్రీ' అని మాత్రం వ్రాస్తే చాలు. సంబోధన చివరలో గౌరవ సూచకంగా 'గారు' అని వ్రాయాలి.

3. పెద్దవాళ్ళకైతే 'నమస్కారాలు' అని చిన్నవాళ్ళకైతే 'ఆశీస్సులు' అని సంబోధన పూర్తి చేయాలి.

   'వీనివల్ల ఆత్మీయత', ఆదరము చదువుకొనే వాళ్ళకు కలుగుతాయి.

4. మనం తెలుపుతున్న సమాచారాన్ని క్లుప్తంగా సామాన్య వాక్యాల్లోనే వ్రాయడం మంచిది. త్వరగా తెలుసుకొనే వీలౌతుంది. స్థలాన్ని ఉపయోగించుకోవడం జరుగుతుంది.

౫. లేఖ చివర కుడివైపు పెద్దవాళ్ళకైతే "భవదీయుడు" "విధేయుడు" "విశ్వాసపాత్రుడు" అనే వానిలో ఏది ఉచితంగా ఉంటుందో దానిని వ్రాసి సంతకం చేయాలి. చిన్నవాళ్ళకైతే 'ఆశీస్సులతో' అనివ్రాసి సంతకం చేయాలి.

6. ఒకదాని కంటే ఎక్కువ విషయాలు వ్రాసేటప్పుడు ఒక్కొక్క దానిని ఒక్కొక్క పేరాగ్రాఫ్‌గా వ్రాయాలి.

7. నిర్ణీత స్థలాల్లో ఎవరికి లేఖ వ్రాస్తున్నామో వారి అడ్రసు (చిరునామా) వ్రాయాలి. అట్లే మన అడ్రసు మరోవైపు పూర్తిగా వ్రాస్తే మంచిది. ఆ పత్రం తీసుకోవలసిన వాళ్ళు ఊళ్ళో లేకపోతే మళ్ళీ మనకే చేరేందుకు ఉపయోగపడుతుంది.

8. స్థలాభావాన్ని దృష్టిలో వుంచుకొని స్థూలంగా, సూటిగా విషయాన్ని వ్రాయడం లేఖకు ముఖ్యం.

ఉదాహరణకు కొన్నిలేఖలు ఈ క్రింద ఉన్నవి. గమనించండి:-

1. (అక్కయ్య వివాహానికి వెడుతూ మూడురోజుల సెలవుకై ప్రధానాధ్యాపకునకు 'సెలవు పత్రం' వ్రాయుము.)

హరి బవులి
1-12-1979

శ్రీ ప్రధానోపాధ్యాయుల గారికి
రిఫా-ఏ-ఆం ఉన్నత పాఠశాల,
హరి బవులి, హైదరాబాదు-2.

అయ్యా!

మా అక్కయ్య వివాహం ఈనెల 3వ తేదీ మాస్వగ్రామంలో జరుగుతుంది. అందువల్ల రేపటినుండి 5వ తేదీ వరకు తరగతికి రావడం లేదు. దయతో ఈ మూడురోజులు సెలవు ఇప్పించ ప్రార్థించుచున్నాను.

విధేయుడు
K. V. శర్మ
6వ తరగతి. బి
వరుస సంఖ్య 16

2. (నీ చదువును గూర్చి తండ్రిగారికి తెలిపి, పరీక్షారుసుము పంపవలసినదిగా ఉత్తరము వ్రాయుము.)

హైదరాబాదు
2-12-1979

పూజ్యులు నాయనగారికి

నమస్కారములు

మీ ఆజ్ఞతో ఇక్కడికి వచ్చిన నాటినుండే పరీక్షకై చదువు ప్రారం

ళించినాను. వ్యాకరణ సూత్రములు సరిగా బోధపడనందున ఆ పత్రంలో మాత్రం ఏభై శాతం మార్కులు రావచ్చు. మొత్తం మీద ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణురాలనవుతాననే విశ్వాసం కుదిరింది.

ఈ నెల 15వ తేదీ లోపల పరీక్షారుసుం చెల్లించాలని పరీక్షాధికారులు ప్రకటించారు. అందువల్ల పరీక్షారుసుం రు.35 లతో పాటు మరో 15. రూ॥లు కలిపి ఏభై రూపాయలు 12వ తేదీలోపల M. O. చేయండి.

అక్కడ అమ్మకు నమస్కారాలు చేసినట్లు, తమ్ముళ్ళను ఆశీర్వదించినట్లు తెలపండి. M. O. కొరకు ఎదురు చూస్తుంటాను.

మీ విధేయురాలు
K. శేషు
H. No. 23-6-121/1
హరి బవులి, హైదరాబాదు

చిరునామా :-
శ్రీ K. రామకృష్ణయ్యగారు
గుమ్మడిదల P. O.
నర్సాపూర్ Tq.
మెదకు జిల్లా ఆం ప్ర.

3. (నీవు చూచిన హంపి నగరాన్ని గూర్చి తెలుపుతూ స్నేహితునికి జవాబు వ్రాయుము.)

హైదరాబాదు
3-12-1979

మిత్రమా !

గత నవంబరు 20వ తేదీనాడు మా కళాశాల నుండి 'విజ్ఞాన యాత్ర' కుగాను 'హంపి' వెళ్లాము. 'ఆనెగొంది, హంపి, విజయనగరాలు రామలకాలం నాటి చారిత్రక అవశేషాలుగా నేటికీ మిగిలిఉన్నాయి.

అక్కడి ఎత్తైన కొండల మధ్య నుండి తుంగభద్ర గంభీరంగా ప్రవహిస్తున్నది. దాని తీరంలోనే శిథిలమై పడి ఉన్న విజయనగర ప్రాసాదాలు, శిల్పకళా శోభితమైన ఆలయాలు మనల్ని కదలనీయవు.

అక్కడికి దగ్గరలోనే హాస్పేట వద్ద నిర్మించిన తుంగభద్ర ఆనకట్ట వల్ల ఆ ప్రాంతమంతా పచ్చని పంట కాల్వలతోను, చెఱకు తోటలతోను కళకళ లాడుతున్నది. ఒకసారి తప్పక చూచిరావలసిందే తప్ప చెప్పడానికి వీలుకాదు. మీ కళాశాల ద్వారా వెళ్ళడానికి ప్రయత్నం చేయి.

నీ చదువు, ఆరోగ్యాది విశేషాలతో జాబు వ్రాయి.

నీ ప్రియమిత్రుడు
Y. శివకుమార్
వైశ్య విద్యార్థి వసతి గృహం
కాచిగూడ, హైదరాబాదు

చిరునామా :-
శ్రీ T. P. రామచంద్రయ్య
B, A. (L) I Year
శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య కళాశాల
తిరుపతి చిత్తూరు జిల్లా ఆం. ప్ర.

4. (మంచి పుస్తకాన్ని చదవాల్సిన అవసరాన్నిగూర్చి తమ్మునికి లేఖ వ్రాయుము.)

హైదరాబాద
30-11-197.

చిరంజీవి తమ్మునికి ఆశీస్సులు

మొన్న నాయనగారు వచ్చి అచటి క్షేమాలన్నీ చెప్పినారు. నీవు పాఠ్య పుస్తకాలకన్న అధికంగా పాఠ్యేతర పుస్తకాలు చదువుతున్నట్లు చెప్పినారు. నిజానికి పాఠ్య పుస్తకాలు ఏ రెండు నెలల్లోగానే చదివేట్లు

ఉంటాయి. అయితే లెక్కలు మొదలైన కొన్ని విషయాలు మాత్రం ఎప్పుడూ అభ్యాసంలో ఉండవలసినవే.

పాఠ్యేతర పుస్తకాలు చదివేటప్పుడు మంచిపుస్తకాన్ని ఎన్నుకోవడం తెలుసుకోవాలి. ఉదాహరణకి కందుకూరి వీరేశలింగం పంతులుగారి 'స్వీయ చరిత్ర' ఉంది. అక్కడక్కడ ఆయనను గూర్చి చదివే ఉన్నాం కదా అనుకోవద్దు. ఆయనను గూర్చి చెప్పింది వేరు ఆయనే స్వయంగా అనుభవాల్ని వివరించింది వేరు.

సంఘ సంస్కరణలో ఆయన పడ్డపాట్లు, కార్యసాధనలో ఆయన చూపిన నేర్పు, ఆ పుస్తకం చదివితేనే తెలుస్తుంది. అందువల్ల మహాత్ములు వ్రాసినవి మొదట చదివి, వారిని గూర్చి ఇతరులు వ్రాసినవి చదివితే మనకు సంపూర్ణంగా అవగాహన కలుగుతుంది. అందువల్ల మంచిపుస్తకాలను ఎన్నుకొని చదువు. ఒక పుస్తకం చదివి నీవు తెలుసుకున్న విషయాలు వ్రాయి.

ఆశీస్సులతో మీ అన్న
R. చిదంబరం

చిరునామా :-
మాస్టర్ R. వేణుగోపాల్
10వ తరగతి
జిల్లా పరిషత్ హైస్కూలు
జనగామ వరంగల్ జిల్లా

5. (నీ యోగ్యతలను తెలుపుతూ జిల్లాపరిషత్ అధ్యక్షులకు ఉద్యోగము కోరుతూ అభ్యర్థి పత్రము వ్రాయుము.)

శ్రీ అధ్యక్షులు గారికి
మెదక్ జిల్లాపరిషత్ కార్యాలయము
సంగారెడ్డి — మెదక్ జిల్లా

విషయం :- ఉద్యోగము కొరకు దరఖాస్తు.

అయ్యా !

తమ జిల్లాపరిషత్ అధీనంలో మూడు గుమాస్తా (L. D. C) ఉద్యోగాలుఖాళీ ఉన్నట్లు 'ఆంధ్రభూమి' దినపత్రిక 30-11-1979 నాటి ప్రకటన వల్ల తెలిసింది. కావున నా యోగ్యతలను ఈ క్రింద పొందు పరుస్తున్నాను. అవకాశ మిప్పించినట్లయితే నా పని ద్వారా మీ మెప్పు పొంద గోరుతున్నాను.

| | |
|---|---|
| 1. పేరు | G. నారాయణ రెడ్డి |
| 2. తండ్రి పేరు | G. రామిరెడ్డి |
| 3. పుట్టిన తేది | 1-1-1959 |
| 4. విలాసము | బొంతపల్లి పోస్టు, నరసాపూర్ తాలుకా. మెదక్ జిల్లా ఆం. ప్ర. |
| 5. యోగ్యతలు | 1. S. S. C. (1975)<br>2. తెలుగు టైపు లోయర్ (1976) |
| 6. తండ్రి ఆదాయము/వృత్తి | సం॥ ఆదాయము రు. 3000-00<br>వ్యవసాయం |
| 7. వివాహమైనదా | కాలేదు. |

G. నారాయణ రెడ్డి
(సంతకం)

తేది : 2-12-1979

6. మీ బస్తీ అవసరాలను గూర్చి మునిసిపల్ కమీషనర్ గారిని అభ్యర్థిస్తూ 'ఈనాడు' పత్రికకు లేఖ వ్రాయుము.)

'ఈనాడు' పత్రికా సంపాదకులకు మనవి.

అయ్యా !

ఈ క్రింది లేఖను తమ దినపత్రిక 'లేఖలు' శీర్షికలో ప్రచురింప గోరుచున్నాను.

—

'మేకలబండ' శాలిబండ రోడ్డుకు ప్రక్కన ఉన్న బస్తీ అయినా చదువుకునే విద్యార్థులకు విద్యుచ్ఛక్తి సరిపోదు. మధ్యరాత్రి రెండుగంటలు తప్ప మంచినీరు కొళాయిలో రాదు. సెలవు రోజుల్లోనైనా చదువు కుందా మంటే గ్రంధాలయం లేదు. వైద్యశాల కూడ లేదు. మా బాధలు గుర్తించి పురపాలక సంఘాధ్యక్షులు మాకీ సదుపాయాలు కలుగజేయగల రని కోరుతున్నాము.

ఇట్లు

R. రాములు

B. కృష్ణ

6-12-1979

మేకల బండ

7. (ఆరోగ్యము సరిగా లేనందువలన ఆఫీసుకు రావడం లేదని తెలుపుతూ వారంరోజులు సెలవునకై పత్రము వ్రాయుము)

ఆలియాబాదు
6-12-1979

శ్రీ డైరెక్టరుగారికి
వైద్య ఆరోగ్యశాఖ
హైదరాబాదు ఆం. ప్ర

విషయం :- వారం రోజులు సెలవు కొరకు పత్రం.

అయ్యా !

'మలేరియా' కారణంగా రెండురోజుల నుండి లేవలేకుండా ఉన్నాను. నేడు డాక్టరుగారిని సంప్రదించగా మరో వారం రోజులు విశ్రాంతి తీసుకుంటూ మందులు వాడవలసినదిగా చెప్పినారు. అందువల్ల వారంరోజులు (10-12-1979 నుండి 17-12-1979 వరకు) కార్యాలయానికి రావడం లేదు. డాక్టరు సర్టిఫికెట్టు నేను వచ్చినప్పుడు కార్యాలయంలో ఇవ్వగలను. కావున వారంరోజులు సెలవిప్పించమని ప్రార్థిస్తున్నాను.

ఇట్లు
విశ్వాసపాత్రుడు
B. హరి, U. D. C.

చిరునామా :-
B. హరి, U. D. C.
H. No. 23-4-395
ఆలియాబాదు, హైద్రాబాదు-2

3. (బజారులో దొరకని గ్రంథాన్ని గూర్చి ప్రచురణ కర్త లకు ఒక లేఖ వ్రాయుము.)

హరిబవులి
12-12-1979

శ్రీ కార్యదర్శిగారికి
ఆంధ్రసారస్వత పరిషత్తు
తిలక్ రోడ్డు, హైదరాబాదు-500 001

అయ్యా!

తాము ఎన్నో ఉత్తమ ప్రచురణలను ప్రచురించినారు. వాటిలో చాలా గ్రంథాలు బజారులో దొరకడం లేదు. అందువల్ల తమకు తెలుపు కుంటున్నాము.

1. సంస్కృత వాఙ్మయ చరిత్రము (లౌకికభాగము)
2. భారత-భాగవత ఉపన్యాసాలు (రెండుగ్రంథాలు)
3. స్త్రీల రామాయణ-పౌరాణిక పాటలు (రెండుగ్రంథాలు)

బజారులో దొరకడంలేదు. పై గ్రంథాలను ప్రచురించి 20 సంవత్సరాలు దాటింది. తమ విశారద పరీక్ష మొదలుకొని అన్ని విశ్వవిద్యాలయాల ఎం. ఎ. పరీక్షల వరకు పాఠ్యగ్రంథాలుగా నిర్ణయింపబడినాయి. B. A. (లాంగ్వేజెస్) పరీక్షకు సంస్కృత వాఙ్మయ చరిత్రము (లౌకికభాగము) పాఠ్యముగా నిర్ణయించారు. రెండు మూడు సంవత్సరాలుగా పుస్తకం దొరకనందువల్ల పరీక్షాభ్యర్థులకు ఇబ్బంది కలుగుతున్నది. అందువల్ల వెంటనే ఆ గ్రంథాలు ప్రచురించి విద్యార్థులమైన మాకు సహకరించగలరు.

మీవద్ద రెండు మూడు ప్రతులుంటే ఈ క్రింది అడ్రసుకు 'సంస్కృత

వాఙ్మయ చరిత్రము' (లౌకికభాగము) పంపించ కోరుతున్నాము. V. V. P గా పంపించ గలరు.

ఇట్లు
భవదీయుడు
S. K. సుదర్శనం
B. O. L. 2వ సంవత్సరం
A. S. P. ప్రాచ్యకళాశాల
తిలక్‌రోడ్డు, హైద్రాబాదు-1

9. (25 పాఠ్యపుస్తకాలు, 50 చిత్రపటములు పంపించమని కోరుతూ 'వ్యాపారలేఖ' వ్రాయుము.)

శ్రీ విద్యా బుక్‌డిపో
బడీచావుడీ,
హైదరాబాదు-500 001
తే॥ 15-12-1979

శ్రీ మేనేజరుగారికి
త్రివేణి పబ్లిషర్స్
మచిలీపట్నం
కృష్ణాజిల్లా. ఆం. ప్ర.

ఆర్యా!

ఈ క్రింది పుస్తకాలు రైల్వే పార్శిలు ద్వారా పైన సూచించిన చిరునామాకు పంపించగలరు. రు. 100=00లు అడ్వాన్సుగా M. O. చేసియున్నాము. మాకు ఇచ్చే కమీషను పోను మిగతా డబ్బుకు V. P. చేస్తూ వెంటనే పంపించగలరు.

1. కవిసార్వభౌముడు (నోరి నరసింహశాస్త్రిగారు)—25 ప్రతులు

2. తెలుగుబోధిని (వయోజనులకుద్దేశించిన చిత్రపటప్రదర్శిని)-50ప్రతులు

ఇట్లు
ప్రొ ప్రయిటర్
శ్రీ విద్యా బుక్ డిపో
ఆర్యసమాజ మందిరం ఎదుట
బడీచావుడీ, హైదరాబాదు ఆం.ప్ర.

10. (మీ ప్రాంతంలోని తెలుగువారికి తెలుగు పరీక్షలను గూర్చి పరీక్షా కార్యదర్శిగారికి జాబు వ్రాయుము.)

మదరాసు
15-12-1979

శ్రీ పరీక్షా కార్యదర్శిగారికి
ఆంధ్ర సారస్వత పరిషత్తు
తిలక్ రోడ్డు, హైదరాబాదు-500 001

ఆయ్యా!

ఈ నగరంలో తెలుగువారు ఎక్కువగా నివసిస్తున్న విషయం తమకు తెలియనిది కాదు. భాషాప్రయుక్త రాష్ట్రాలు ఏర్పాటు చేసిన తరువాత తెలుగు చదువుకొనే అవకాశాలు పూర్తిగా తగ్గినవి. తెలుగు బాలికలు, గృహిణులు తెలుగు నేర్చుకోవడానికి తగిన వసతులు లేవు. అందువల్ల కొంతమంది యువకులం చేరి 'రాత్రి పాఠశాల' నొకదానిని ఏర్పాటుచేసుకొన్నాం.

తమ పరీక్షా నియమావళిని, పాఠ్యప్రణాళికను వెంటనే పంపించినట్లయితే మా పాఠశాల ద్వారా కొందరు అభ్యర్థులను పరీక్షకుగాను

సిద్ధంచేస్తాము. ఇక్కడనే కేంద్రం ఏర్పాటుకు అనుమతించి, పాఠ్యప్రణా ళికను, అభ్యర్థి పత్రాలను పంపించి మాకు తెలుగు చదువుకొనే అవ కాశాన్ని కలిగించండి.

తాము గత నలభై ఏళ్ళుగా తెలుగు భాషా సాహిత్యాల ప్రచార కార్యక్రమాన్ని చేపట్టిన సంగతి యావదాంధ్రులు మరువలేరు. ఇంకా ఆ కార్యక్రమాన్ని కొనసాగించాల్సిన అవసరం ఎంతగానో ఉన్నది. తెలుగు రాష్ట్రానికి దూరంగా వున్న తెలుగువారిలో తెలుగు సంస్కృతిని వృద్ధి చేయాల్సిన కార్యక్రమాలు అప్పుడప్పుడు ఈ ప్రాంతాల్లో కూడ జర పండి. మా సహకారం సంపూర్ణంగా ఉంటుంది.

అందువల్ల వెంటనే తెలుగు పరీక్షలను గూర్చిన సంపూర్ణమైన సమాచారాన్ని అందించండి. మీ జాబుకై ఎదురు చూస్తుంటాము.

ఇట్లు

భవదీయుడు

శ్రీధరమూర్తి

13, ఆచారప్పన్ మొదలిస్ట్రీటు

తిరువల్లిక్కేణి

మదరాసు-600 005

తమిళనాడు

11. (ఎన్నికల్లోనెగిన స్నేహితుని అభినందిస్తూ జాబు వ్రాయుము.)

14 రామవిలాస్
ఇసామియా బజారు,
హైదరాబాదు
5-8-1979

నారాయణరావు,

నువ్వు తెలుగు సారస్వత సమితికి కార్యదర్శివిగా ఎన్నుకోబడి నందుకు నా హృదయపూర్వక అభినందనాలు. నీవంటి సారస్వత సేవకుని కార్యదర్శినిగా ఎన్నుకొని, సభ్యులు తమ బుద్ధి కుశలతను వెల్లడించిసారు. నీ చేతిలో సమితి ఇతోధిక అభివృద్ధిని పొందగలదని ఆశిస్తున్నాను.

ఇదివరకు వలెనే ఇప్పుడూ సారస్వతాభివృద్ధికై పాటుపడతావని ఆశిస్తున్నాను.

ఇట్లు
ప్రియమిత్రుడు
వంకా రామారావు

12. (బదిలీ పత్రాన్ని కోరుతూ ప్రధానోపాధ్యాయుడికి లేఖ వ్రాయుము.)

ప్రధానోపాధ్యాయులు
ప్రభుత్వోన్నత పాఠశాల
నారాయణగూడ
హైదరాబాదు

అయ్యా !

మా నాయనగారికి నిజామాబాదుకు బదిలీ అయింది. నేను వారితో వెళ్లక తప్పదు. కనుక దయఉంచి నాకు స్కూలు బదిలీ పత్రాన్ని ఇప్పించ గోరుతున్నాను.

ఇంతవరకు మీ వద్ద విద్య అభ్యసించినందుకు కృతజ్ఞుడనై ఉంటాను. నమస్కారాలు

ఇట్లు
విధేయుడు
రామకృష్ణ
8వ తరగతి

# 'వ్యాస రచన' గమనించాల్సిన విషయాలు

"వ్యాస" మనే పదానికి 'వివరణ' అని అర్థం ఒక విషయాన్ని గూర్చిన సమాచారం క్రమపద్ధతిలో వివరించి వ్రాస్తే 'వ్యాసం' అవుతుంది. దీన్నే నలుగురి ఎదుట ముఖతః చెప్తే ఉపన్యాస మంటారు.

వ్యాసరచనలో ముఖ్యంగా మూడు భాగాలు గమనించాలి.

మొదటి భాగం : 'ఉపక్రమం' అంటే ఆరంభ మన్నమాట. ఇచ్చిన శీర్షికను వివరించి, అందలి విభాగాల్ని సూచించాలి.

రెండవ భాగం : 'వ్యాస శరీరం' ఈ విభాగంలోనే విషయాన్ని క్షుణ్ణంగా వివరించాలి. మంచిచెడ్డలను కారణాలతో తేల్చి చెప్పాలి. ఒక్కో విషయాన్ని ఒక్కో పేరాగ్రాఫ్‌లో వివరించాలి. వ్యాసం నిడివి విషయాన్ని బట్టి పొడిగించడమో, తగ్గించడమో చేయాలి. సాధారణంగా పరీక్షలో మూడు పేజీల వ్యాసం వ్రాయమంటారు. పత్రికలకు వ్రాస్తే స్థలాన్ని దృష్టిలో పెట్టుకొని వ్రాయాల్సి ఉంటుంది. ప్రత్యేక గ్రంథంగానే వ్రాయ దలచినపుడు అన్ని విషయాలు సమగ్రంగా, సోదాహరణంగా మనకు తోచినంత వ్రాయవచ్చు.

మూడవ భాగం : వ్యాసపు ముగింపు దీనిని "ఉపసంహారం" అంటారు. ఈ భాగంలో చర్చించిన విషయాన్నంతా సంగ్రహంగా పేర్కొని మనం చెప్పే మంచిచెడ్డలను స్పష్టంగా వ్రాసి ముగించాలి.

వ్యాసరచన లేఖారచనకు సంపూర్ణంగా భిన్నమైనది. లేఖలో విషయం స్పష్టంగా సంక్షిప్తంగా ఉండాలి. వ్యాసంలో సమగ్రంగా కారణాలతో చర్చించి మంచిచెడ్డలను విడమర్చి చూపాలి. అందువల్ల స్థలాభావం,

సంకోచం వ్యాసరచనకు పనికిరాదు. సమగ్రమైన వివరణమే వ్యాసరచనకు ప్రాణం.

విషయాన్ని బట్టి వ్యాసం కూడా అనేకరకాలుగా ఉంటుంది. ఒక కావ్యాన్ని గూర్చి వ్రాసినది సాహిత్య వ్యాసమైతే, చరిత్రను గూర్చి వ్రాసినది చారిత్రక వ్యాసం. రాజకీయాన్ని గురించి వ్రాస్తే రాజకీయవ్యాసం, సమాజాన్ని విడమర్చి చూపేది సామాజిక వ్యాసంగా చెప్పవచ్చు. ఇట్లే కళా సంబంధమైనది ఆర్థిక విషయానికి సంబంధించినదీ మొదలైనవి.

విషయమేదైనా సంపూర్ణ వివరణ వ్యాసంలో ముఖ్యం. ఒక్కొక్క విభాగాన్ని ఒక్కొక్క పేరాగ్రాఫ్‌గా వ్రాయడం చదువరులకు ఆసక్తిని, అవగాహనను పెంచుతుంది. విషయాన్ని బట్టి వ్యాసరచన సాగుతుంది.

ఉదాహరణకు ఈ క్రింద కొన్ని వ్యాసాలు ఉన్నాయి. గమనించండి—

## 1. వార్తా సౌకర్యాలు

విజ్ఞాన శాస్త్రాభివృద్ధి (సైన్సు) వల్ల ప్రపంచమంతా ఒకే కుటుంబంగా ఈ శతాబ్దంలో మారిపోయింది. అందువల్ల ఏ ప్రాంతంలో, ఏ దేశంలో ఏమి జరుగుతున్నదో తెలుసుకోవాల్సిన అవసరం ఈనాటి మానవున కెంతో ఉన్నది. అందువల్ల విజ్ఞాన శాస్త్రవేత్తలే కొన్ని సౌకర్యాలను గూడ తయారు చేసారు.

వార్తాసౌకర్యాలలో మొదటిది వార్తాపత్రిక. ముందురోజు జరిగిన సమాచారాలనన్నింటిని సంగ్రహించి ముద్రాయంత్రం ద్వారా కొన్ని పేజీలు ప్రచురించే పత్రిక వార్తాపత్రిక. ఒకేచోట ఉన్న మానవుడు దేశంలో:

వార్తల నన్నింటిని ఈ పత్రిక ద్వారా తెలుసుకోవచ్చు ఈ పత్రికలు వివిధ భాషల్లో వివిధ ప్రాంతాల నుండి వెలువడుతున్నాయి. మొదట్లో ఆయా ప్రాంతాల్లోని విలేఖరులు వార్తలను పంపడానికి ఇబ్బంది కలిగేది. కాని నేడు టెలిప్రింటరుద్వారా విలేఖరి పంపేవార్త ఎప్పటికప్పుడే పత్రిక ఆఫీసుకి చేరుతుంది. వాటినన్నింటిని సంపాదకులు వరుసలో కూర్చి వార్తా పత్రికను ప్రచురిస్తారు. ఈ పత్రికల్లో ప్రాంతీయ వార్తలు, విదేశీయ వార్తలు, ప్రకటనలు, ఆరోగ్యాది విషయాలు, ఆటలు, సినిమాలు మొదలైనవన్నీ వానికి కేటాయించిన స్థలాల్లో ప్రకటింపబడుతాయి. ఈ పత్రికలు దిన-వార-పక్ష-మాస-వార్షిక ప్రత్యేక సంచికలుగా అనేక రకాలున్నాయి.

రెండవసౌకర్యం టెలిఫోను, తీగెలద్వారా ఒకచోటినుండి మరోచోట నున్నవారి ద్వారా మాట్లాడి విషయాలు తెలుసుకోవచ్చు. అయితే వ్యక్తిగత విషయాలకే ఇది ఎక్కువగా ఉపయోగపడుతుంది. అంటే వ్యాపార సంస్థలు, బజారు ధరవరలు తెలిసికోవడానికి, వ్యక్తిగతంగా యోగక్షేమాలు తెలిసికోవడానికి టెలిఫోను ఉపయోగపడుతుంది. నిమిషాల మీద కావలసిన పనులు నెరవేర్చుకోవచ్చు. ఈ రకంగా టెలిఫోను నేటి సమాజంలో ఎంతో ఉపయోగపడుతున్నది.

మూడవది రేడియో. దీనికి టెలిఫోను వలె తీగల సహాయంకూడ అవసరంలేదు. ఒకచోట నుండి విద్యుచ్ఛక్తి సాయంతో వార్తల్ని ఆకాశంలో ప్రసరింపచేస్తారు. ఆ వార్తలు గాలిలో అన్ని ప్రాంతాలకు వ్యాపిస్తాయి. వినదలచిన వారు రేడియో సాయంతో వార్తల్ని వినవచ్చు. ఈ ప్రసార యంత్రాలను దేశంలో అనేక ప్రాంతాల్లో ప్రభుత్వం ఏర్పాటు చేసింది. అనేక కేంద్రాలు అనేకరకాల కార్యక్రమాల్ని ప్రసారం చేస్తున్నాయి. మనకిష్టమైన కార్యక్రమాల్ని ఆయా స్టేషన్ల ద్వారా విని ఆనం

దించవచ్చు. రేడియో ద్వారా ప్రసారమయ్యే కార్యక్రమాలన్నీ ఆయా సమయాలను సూచిస్తూ 15 రోజులముందే 'వాణి' అనే పత్రిక ద్వారా తెలుసుకోవచ్చు. దేశవిదేశ వార్తలన్నీ ప్రత్యేకంగా కేటాయించిన సమయాల్లో రోజు ప్రసారమౌతాయి.

కళాకారుల కంఠాలతోపాటు వ్యక్తుల్ని చూచే అవకాశం 'టెలివిజన్' ద్వారా కలుగజేశారు శాస్త్రజ్ఞులు. రేడియోవలెనే టెలివిజన్‌లో పాటలు, వార్తలు, నాటికలు, ప్రసంగాలు వినవచ్చు. చదువుతున్న కళాకారులు మన ఎదుట తెరపై కనబడతారు. టెలివిజన్‌లో సంపూర్ణచిత్రాల్ని కూడా చూపుతున్నారు. విదేశాల్లోవలె మనదేశంలో T. V.లు ఎక్కువగా కొనే స్తోమత ప్రజలకు లేనందువల్ల కొందరు ధనవంతులు మాత్రమే టెలివిజన్‌ను ఉపయోగింప గలుగుతున్నారు.

చలనచిత్రం (సినిమా) కూడా ఒక విధంగా వార్తాసౌకర్యాలలో చేరుతుంది. పదిరకాల మనస్తత్వం గలవాళ్ళు ఒకేచోట చేరి విజ్ఞానవినోదాల్ని అనుభవించడానికి దీనికంటే మేలైన సాధనం నేడు లేదు. ఒక చిత్ర నిర్మాణంలో లక్షలకొద్ది రూపాయలు ఖర్చయినా రెండు మూడు రూపాయల్లో మనంచూచి ఆనందించే సాధనమిది. ప్రభుత్వం తలపెట్టిన ప్రణాళికలు, చేపట్టి నిర్వహించిన కార్యక్రమాలు సినిమాలద్వారా ప్రజలకు చూపుతున్నారు. ఎక్కడ ఏయే పరిశ్రమలు ప్రాజెక్టులు నిర్మించారో, వానివల్ల దేశం ఎంతప్రగతి సాధించిందో తెలుసుకొనే అవకాశం ఈ సినిమా వల్ల కలుగుతున్నది.

ఈ విధంగా మనదేశంలోని వార్తాసౌకర్యాలు యథాశక్తి ఎప్పటి సమాచారాన్ని అప్పుడే అందిస్తూ దేశప్రజల్ని విజ్ఞానవంతులుగా చేస్తున్నాయి.

# 2. చలన చిత్రములు (సినిమా)

ఈనాడు ప్రజలకు ఒకే ఒక వినోదం చలనచిత్రం. చలనముగల చిత్రమైనందువల్ల "చలనచిత్రం" అనే పేరు వచ్చింది.

చలనచిత్రాలకు పూర్వరూపాలు నాటకాలు, వీధి భాగవతాలు, పండగల్లో, జాతర్లలో వీటిని ప్రదర్శించే వారు. సామూహికంగా ఆనందించడానికి ఇవి బాగా ఉపయోగపడతాయి. అయితే విజ్ఞానశాస్త్ర ప్రయోజనంగా సినిమా తయారైన తరువాత ఒకే సినిమాను దేశంలోని ప్రజలంతా ఒకేసారి చూచే వీలు కలిగింది.

ఒక సినిమా తయారు కావడానికి ఎంతో మంది కళాకారులు, ఎన్నో లక్షల రూపాయలు కావాలి. ఎంతోకాలం శ్రమిస్తేనే కాని సినిమా తయారుకాదు. కాని తక్కువఖర్చుతో ఎక్కువమంది ఆనందించే అవకాశం ఉంటుంది.

కథనుబట్టి సినిమా చాలా రకాలుగా ఉంటుంది. పురాణకథైతే పౌరాణిక చిత్రం, సమాజానికి సంబంధించినదైతే సాంఘికచిత్రం, అద్భుత సాహసాలను ప్రదర్శిస్తే జానపదచిత్రం అనిచెప్పవచ్చు. అపరాధ పరిశోధక చిత్రాలు. అడపాదడపా పోట్లాటలుగల చిత్రాలు నేడు ఎక్కువగా ప్రజల్ని ఆకర్షిస్తున్నాయి.

సంగీతము, సాహిత్యము, చిత్రకళ, నాట్యము. శిల్పం అనే లలిత కళలు ఒకేచోట ఉన్నందువల్ల ఈ చిత్రాలు అన్నిరకాల వాళ్ళను ఆనందింప చేస్తాయి. ఆయా కళాకారులందరికీ అవకాశం దొరుకుతుంది. వారికి జీవనోపాధి కలుగుతుంది.

చలన చిత్రాలవల్ల కేవలం ఆనందమేకాక మంచిని పదిమంది తెలుసుకొనేట్లు చేయడానికి వీలుంది. న్యాయాన్యాయాల ఘర్షణచూపి ప్రజలు న్యాయంగా నడచుకొనే మార్గం చూపవచ్చు. స్వార్థం ఎంత మందికి నష్టాన్ని కలిగిస్తుందో చెప్పవచ్చు. స్వార్థపరుల్ని సామూహికంగా ఎట్లా అటకట్టించవచ్చో తెలుసుకోడానికి వీలుంటుంది. సమాజం లోని దురాచారాలను చూపి సంస్కరించడానికి వీలౌతుంది. వరకట్నం, మద్యపానం మొదలైన దురలవాట్లవల్ల కలిగే నష్టాలను చూపడానికి ఈ చలన చిత్రాలెంతో ఉపయోగపడతాయి. పొదుపు చేయడం, కుటుంబ సంక్షేమం, సహకార సంఘాల ఆవశ్యకత మొదలైన సదాచారాలను ప్రచారం చేయవచ్చు.

సినిమాలన్నీ మంచినే బోధిస్తాయి అనడానికి వీలులేదు. సినిమాల వల్ల కొన్ని చెడుగుణాలు కూడా కలిగే అవకాశం వుంది. సినిమా పరిశ్రమ కూడ వ్యాపారసంస్థే. అందువల్ల నిర్మాతలు తమకు లాభం వచ్చేటట్లు చూస్తారు. ప్రేక్షకుల అభిరుచులను గమనించి, వారి బలహీనతను ఆసరాగా తీసుకొని అశ్లీలాన్ని ఎక్కువగా చూపడం జరుగుతున్నది. అవినీతి, అక్రమాలు ఎక్కువగా చూపి, నీతి గెలిచినట్లు చివర కొద్దిగా చూపి ముగించడంతో ప్రేక్షకులకు నీతిగా బ్రతుకలేమనే భావం కలుగుతుంది. దానితో అవినీతికి పాల్పడే అవకాశం ఉంది.

అందువల్ల సినిమా చూచేటప్పుడు 'మంచి-చెడు' గమనించి మంచిని గ్రహించాలి. చలనచిత్రం చూచే ముందు మంచిచిత్రాన్ని ఎన్నుకోవాలి. దానికి చిత్రాన్ని గూర్చి వ్రాసిన పత్రికల అభిప్రాయాలు, మంచి వాళ్ళు మెచ్చుకొన్న మెప్పులు గమనించాలి. వాస్తవికత అనే సాకుతో స్త్రీలను నగ్నంగా చూపడం, స్త్రీలపై అత్యాచారాలు చూపే చిత్రాలు

నేడు ఎక్కువగా వస్తున్నాయి. ఇటువంటి చిత్రాలే యువతరాన్ని చెడు త్రోవకు త్రిప్పుతున్నాయి.

కాబట్టి నిర్మాతలు జాతిని, నీతిని దృష్టిలో పెట్టుకొని చిత్ర నిర్మాణం చేయాలి. అందుకు 'సెన్సార్' అనే ప్రభుత్వ యంత్రాంగం సక్రమంగా పనిచేయాలి. ప్రేక్షకులు కూడ జాతికి చెడు కలిగించే నీతి బాహ్యమైన చిత్రాలను బహిష్కరించాలి. చలనచిత్రాలు అన్నివిధాలా మానవునికి విజ్ఞాన వినోదాలను ఇస్తున్నవనటంలో సందేహంలేదు.

## 3. కుటీర పరిశ్రమలు

ఇంటి ఆవరణలోనే మనకు అవసరమైన నిత్యావసర వస్తువులను తయారు చేయటానికే "కుటీర పరిశ్రమ" అని పేరు. ఈ పరిశ్రమలో తండ్రికి కొడుకు సహాయంగా ఉంటూ ఆ పనిలో నైపుణ్యం సంపాదించే వాడు. ఒక రకంగా వీనిని గురుకులాలుగా పేర్కొనవచ్చు. కమ్మరము, కుమ్మరము, కంసాలి, వడ్రంగము, చాకలి, మంగలి, చర్మకారవృత్తి మొదలైనవన్నీ ఈ కుటీర పరిశ్రమల్లోనే చేరుతాయి. కొంతకాలానికి ఈ పరిశ్రమలన్నీ 'కులవృత్తులు'గా చెప్పబడినాయి.

విజ్ఞాన శాస్త్రాభివృద్ధి జరగడంతో యంత్ర పరిశ్రమలు విస్తరించినవి. జనాభా పెరుగుతున్నంతగా కులవృత్తులవల్ల వస్తూత్పత్తి పెరుగలేక పోయినది. భారీయంత్రముల సహాయంతో అవసరానికి మించిన వస్తూత్పత్తి సాధించి ఇతర దేశాలకు ఎగుమతి కూడ జరుగుతున్నది. అందువల్ల భారీపరిశ్రమల కారణంగా కుటీర పరిశ్రమలు సన్నగిల్లినవి. ఆయా వృత్తుల వారికి జరుగుబాటు కష్టమైనది.

కుటీర పరిశ్రమలకు పెట్టుబడి చాలా తక్కువ. చేతినిండ పని ఉంటుంది. నాణ్యతను కూర్చే నేర్పు అలవడుతుంది. చేనేత పరిశ్రమ మనదేశంలో చాలా ప్రసిద్ధి చెందింది. విదేశీయులు కూడ మన కళానైపుణ్యాన్ని మెచ్చిన వృత్తులు చేనేత, లోహ పరిశ్రమలు. అర్థకం కూడ తక్కువదేమీ కాదు. ఇవన్నీ నేటి యాంత్రిక యుగం కారణంగా మార్కెట్టులో నిలువ లేకుండా ఉన్నవి. నిరుద్యోగము కూడా పెరగడానికి, దారిద్ర్యం ఎక్కువ కావడానికి కారణం కూడా కుటీర పరిశ్రమలు తగ్గిపోవడమే.

ముప్పై ఏళ్ళుగా ప్రపంచములోని సంపన్న దేశాలతో సమానం కావడానికి మన ప్రభుత్వం కూడా భారీ పరిశ్రమలను వృద్ధి చేసింది. కోట్లకొలది రూపాయలు ఖర్చుపెట్టింది. ఉత్పత్తిని పెంచింది. కాని నిరుద్యోగము, దారిద్ర్యం కారణంగా సామాన్యుడు ఏ వస్తువును కొనలేక పోతున్నాడు. భారీ పరిశ్రమలవల్ల లక్షాధికారి కోటీశ్వరుడైనాడు. పేదవాడు నిరుపేదగా దిగజారినాడు.

నేటికాలంలో విదేశాలతో సమానంగా నిలువడానికి భారీ పరిశ్రమ అవసరమే అయినా దేశీయుల్లో నిరుద్యోగాన్ని తొలగించడానికి, దారిద్ర్యాన్ని పోగొట్టడానికి కుటీర పరిశ్రమల అవసరం ఎంతో ఉన్నది ఈనాడు మనప్రభుత్వంకూడ కుటీర పరిశ్రమల అభివృద్ధికి ఉద్యోగకల్పనకు పూనుకొన్నది. ఎన్నో కోట్లరూపాయలను బ్యాంకులద్వారా పేదలకు సహాయాన్ని అందిస్తున్నది. యువకులు ప్రభుత్వ సహాయాన్ని అందుకొని కుటీర పరిశ్రమల్లో తమనేర్పును చూపి మనదేశపు కళానైపుణ్యాన్ని తిరిగి చూపవలసిన సమయం వచ్చింది. కుటీరపరిశ్రమలతో మరల మన పల్లెలు కళకళలాడాలని ఆశిద్దాం.

# 4. ఆటలు - ఆరోగ్యము

'ఆరోగ్యమే మహాభాగ్యము' అన్న సామెత అన్ని సంపదల్లోను ఆరోగ్యసంపద అతిముఖ్యమనే విషయాన్ని తెలుపుతున్నది. ఈ ఆరోగ్యము పుష్టికరమైన ఆహారం ఉన్నంతమాత్రంలో రాదు. ఆహారాన్ని జీర్ణం చేసుకునే వ్యాయామం ఉంటేనే చేకూరుతుంది. ఆ వ్యాయామం బాల్యంలో ఆటల ద్వారా వస్తుంది. అందువల్ల ఆటలు ఆరోగ్యానికి అవసరమనే విషయం బోధపడుతుంది.

శిశువు తల్లిపాలను త్రాగి ఉల్లాసంగా కాళ్ళుచేతులు ఆడిస్తూ కేరింతలాడుతుంది. అందువల్ల కాళ్ళకి చేతులకు ఊపిరితిత్తులకు వ్యాయామం అవుతుంది. ఆ తరువాత గాఢంగా నిద్రపోతుంది. మూడునాలుగు సంవత్సరా లప్పటినుండి తోటిబాలురతో కలసి ఆడుకోవడం, గెంతడం, పరిగెత్తడం ఆరంభిస్తుంది. ఈ ఆటలే ఆవయసులో బాలబాలికలకు వ్యాయామం అవుతుంది.

ఈ ఆటలు దేశీయాలు, విదేశీయాలు అని రెండురకాలున్నాయి. కబడ్డీ. కోతికొమ్మచ్చి, ఉప్పు తేవడం, గోటీబిల్ల లేక గిల్లి దండ మొదలైనవి శరీరానికంతటికీ వ్యాయామాన్నిచ్చే ఆటలు. చదరంగం, పచ్చీసు, పులిజూదం మొదలైనవి ఒకేచోట కూర్చొని ఆడే ఆటలు. ఇవి మానసికంగా మనిషికి ఆలోచనను, ఆరోగ్యాన్ని కలిగించేవి. విదేశీయమైన ఆటలలో క్రికెట్టు, టెన్నిస్, టేబిల్ టెన్నిస్ మొదలైనవి కొన్ని. ఇవి ధనవ్యయమూ, కాలవ్యయమూ గలవి. కేరమ్స్, డాట్స్ మొదలైన ఆటలు ఒకేచోట కూర్చొని ఆడగలవి. ఫుట్‌బాల్ (బంతి) ఆట దేశవిదేశాల్లోను ఉన్న ఆటే. అయితే పద్ధతులు వేరు.

ఈనాడు ఆటలు కేవలం వ్యాయామంగా, ఆరోగ్యకరాలుగా ఉండటమే కాక, దానిలో నేర్పు చూపడంవల్ల విదేశాల్లో పేరుప్రతిష్ఠలు కూడ కలుగుతున్నాయి. వ్యక్తిగతంగానే గాక జాతికీ, దేశానికి కీర్తిని తెస్తున్నాయి. అందువలననే ప్రభుత్వ శాఖల్లో ఆటలకు కూడ ఒక శాఖ ఏర్పాటుచేయడం జరిగింది. అంతర్ రాష్ట్రీయ పోటీలు నిర్వహించి, అందులో ప్రథములుగా నెగ్గినవారిని ఎంపిక చేసుకొని అంతర్దేశీయ ఆటల పోటీలను ప్రభుత్వమే పంపుతున్నది. ఈ ఆటల శాఖకుగాను కొంతధనాన్ని కేటాయించి చక్కని ఆటగాళ్ళకు శిక్షణ ఇవ్వడం, పోటీలలో ప్రవేశ పెట్టడం జరుగుతున్నది. నేడు అంతర్జాతీయంగా ప్రముఖమైన ఆటలు క్రికెట్టు, హాకీ, పుట్‌బాల్, టేబిల్ టెన్నిస్, చదరంగం మొదలైనవి.

కొన్ని ఆటలు వ్యసనంగా మారే అవకాశం కూడా ఉంది. అట్లా వ్యసనంగా మారినప్పుడు జూదం అంటాము. మనదేశంలో కోళ్ళపందాలు, పొట్టేళ్ళపందాలు ఉండేవి. నేడు అవి తగ్గిపోయినవి. కాని పేకాట, గుర్రం పందాలు విశేషంగా ఆకర్షిస్తున్నాయి. వీనివల్ల లాభపడే వారు కొద్దిమందే. నష్టపోయేది ఎక్కువమంది. వ్యసనంగా మారి పోటీ పెరిగితే ఏ ఆటైనా ధననష్టాన్ని కలిగించి మానసికంగా కుంగదీయడం జరుగుతుంది. అట్లా వ్యసనంగా మార్చుకొన్నవారు తాము నష్టపోయేదే గాక తమ కుటుంబాన్ని, తోటివారిని చెడగొట్టే అవకాశం కూడా ఉంది. అందువల్ల ఆటలను వ్యాయామంగా, వినోదంగా మాత్రమే ఆడుకొన్నట్లయితే శారీరక-మానసిక ఆరోగ్యాలను పొంది సుఖంగా జీవించే సాధనాలు అవుతాయి.

# 5. పండుగలు - వాని ప్రాధాన్యము

పండుగలు ఆబాలగోపాలాన్ని ఆనంద పరుస్తాయనటం మన అనుభవంలోని విషయమే. ప్రతినెలలో ఒకటో రెండో పండుగలు రావడం జరుగుతుంది. ఇవి ఇంటిల్లిపాది కలిసి ఆనందాన్ని అనుభవించడానికి ఉపయోగపడతాయి.

ఈ పండుగలు మతాన్నిబట్టి, కాలాన్నిబట్టి, చరిత్రనుబట్టి ఏర్పడ్డాయి. వివాహాది శుభకార్యాలు ఆయా కుటుంబానికి మాత్రమే సంబంధించినవి. పండగల్లో సంవత్సరాది మొదటిది. 'ఉగాది'అని తెలుగువాళ్ళు పిలుస్తారు. క్రొత్త సంవత్సరం చైత్ర శుద్ధ పాడ్యమితో ఆరంభమౌతుంది. ఆనాడు వసంతఋతువుకు సంబంధించిన వేపపువ్వు, బెల్లం, చింతపండు ఒకచోట చేర్చి, గుజ్జుచేసి, పరిమళద్రవ్యాలు కలిపి, పిల్లలు పెద్దలు కలిసి తీసుకుంటారు. దీనికి 'పచ్చడి' అనిపేరు. క్రొత్త పంచాంగంలోని విషయాలు తెలుసుకుంటారు. దేవునికి, పెద్దలకు నమస్కరిస్తారు. తలంట్లు పోసుకోవడం, పిండివంటలు వండుకోవడం, క్రొత్త బట్టలు తొడుగుకోవడం పండుగలన్నింటిలో పరిపాటే.

పెద్ద పండుగల్లో దసరా, దీపావళి, సంక్రాంతి ముఖ్యమైనవి. దసరా నవరాత్రులలో దేవిని ఆరాధించడం, ఆయుధపూజ, పారువేట ముఖ్యమైనవి ఇది రాజులకాలంలో ఏర్పాటైంది. ఇప్పటికి అనుసరించటం జరుగుతున్నది. దీపావళికి రాత్రిళ్ళు దీపాలు అమర్చడం, లక్ష్మీపూజ ముఖ్యమైనవి. దసరాను శ్రీరామపట్టాభిషేకానికి, పాండవుల విజయానికి చిహ్నంగా చెప్తే, దీపావళిని నరకాసురుని సంహారానికి చిహ్నంగా మన వాళ్ళు భావిస్తారు సంక్రాంతి తెలుగువారికి పెద్దపండుగ. ఆనాటికి అన్ని

పంటలు ఇంటికి చేరుతాయి. ఆ సంతోషంలో కూతుళ్ళను, అల్లుళ్ళను పిలుచుకోవడం, కానుకలు ఇచ్చుకోవడం మొదలైన ఉదారగుణము, ఆత్మీయత ఈ పండుగల్లో కనిపిస్తాయి. సూర్యుడు మకరరాశిలో ప్రవేశించి ఉత్తరమువైపు తిరగడం కారణంగా 'మకరసంక్రాంతి', 'ఉత్తరాయణ పుణ్యకాల'మని పేర్లు వచ్చాయి. చలి, వాన మొదలైనవన్నీ పోయి తేటగా ఉండేకాలం కాబట్టి సంక్రాంతి తరువాత శుభకార్యాలు ఎక్కువగా చేస్తారు.

శ్రీరామ నవమి, కృష్ణాష్టమి, వినాయక చవితి, శివరాత్రి మొదలైనవి మతపరంగా భక్తిని ప్రచారంచేస్తూ ఏర్పడిన పండుగలు. మహమ్మదీయులకు రంజాన్, క్రైస్తవులకు క్రిస్టమస్ మొదలైనవి కూడా ఆయా మతాలవారు చేసుకొనే ముఖ్యమైన పండుగలు. అన్ని పండుగలలోను ఆయా జాతులకు సంబంధించిన సంస్కృతి కనబడుతుంది. పచ్చని తోరణాలు, ముంగిళ్ళలో ముగ్గులు మొదలైనవి హిందువుల సంస్కృతికి చిహ్నాలు. సంస్కృతిని తరతరాలకు అందించడమే ఈ పండుగలకు ముఖ్యం.

ఇవికాక ఆయా దేశీయులకు జాతీయులకు సంబంధించిన పండుగలను 'జాతీయ పర్వదినాలు' అంటారు అటువంటి వానిలో '15 ఆగష్టు' స్వాతంత్ర్య దినోత్సవమైతే '26 జనవరి' రిపబ్లిక్ దినోత్సవం. మొదటిది మనదేశం స్వతంత్రమైన రోజును, రెండవది సర్వసత్తాక ప్ర పాలనను గుర్తుకుతెచ్చేవి. గాంధీజయంతి, నెహ్రూజయంతి మొదలైనవి ఆ మహాపురుషులను స్మరించి ఉత్తేజాన్ని పొందేవి.

ఈ విధంగా పండుగలు మానవుని ఆనంద పరచడానికి, సంస్కృతిని నిలపడానికి, సాంఘికజీవనానికి గుర్తులుగా ఏర్పడినవి.

# 6. విహార యాత్ర

సంసారంలో చిక్కుపడిన మానవునికి క్రొత్త అనుభవాన్ని, విజ్ఞానాన్ని అందించేది విహారయాత్ర. పూర్వకాలంలో తీర్థయాత్రల పేరుతో మనవాళ్ళు క్రొత్త ప్రదేశాలకు వెళ్ళేవారు. అందులో ఇహలోక ప్రయోజనం కంటే పరలోక సౌఖ్యానికిగాను పుణ్యక్షేత్రాలు, పుణ్యనదులు మాత్రమే ప్రాధాన్యము పొందేవి.

యాత్రవలన పరలోకానికి సంబంధించిన పుణ్యమేకాక ఈ లోకానికి అవసరమైన జాతీయత, ఐక్యత కలుగుతాయి. భిన్న ప్రాంతీయులైనా, వేరుభాషలు మాట్లాడినా అంతా మన దేశీయులే, అందరి దేవతలు ఒకరే అనే భావం ఏర్పడి ఐక్యత, ఆత్మీయత కలుగుతాయి. అంతేకాక ఆయా ప్రాంతాలలోని వేషాలను, భాషలను ఆచారవ్యవహారాలను తెలుసుకొనే అవకాశం ఏర్పడుతుంది. అచటి శీతోష్ణస్థితి పరిస్థితులు, అక్కడపండే పంటలు, నీటి వనరులు, భోజన సామగ్రి తెలుస్తుంది. ఇన్నిరకాల ప్రయోజనాలను దృష్టిలో పెట్టుకొని 'యాత్రలు' పూర్వకాలం నుండే ఏర్పాటు చేయబడినవి. వివేకానందుడు మున్నగువారు పలుమార్లు దేశపర్యటన చేసి 'దీనజనోద్ధరణ' ధ్యేయంగా పెట్టుకొన్నవారు మనచరిత్రలో ఎందరో ఉన్నారు.

ఈనాడు మన ప్రభుత్వం పాఠశాల పిల్లలకు విహారయాత్రా సౌకర్యము కలుగజేసినది. పాఠ్యపుస్తకాలలో చదివే విషయాన్ని ప్రత్యక్షంగా విద్యార్థి చూచినప్పుడు ఆయా విషయాలను మననం చేసుకొని, సమన్వయించుకొని మరువకుండా చేసుకొనే అవకాశం ఈ విహారయాత్రలవలన ఉంది. చారిత్రక విషయాలను, భౌగోళిక పరిస్థితులను కేవలం చదువుకొని కథగా చెప్పుకోవడంగాక అనుభవానికి తెచ్చుకొంటాడు విద్యార్థి. వారికి అధ్యాపకులు వివరిస్తూ తోడు ఉంటున్నారు.

'నాగార్జునసాగర్'కు విహారయాత్రకు వెళ్ళినవాడు ఆ ప్రాంతానికి గల ప్రాచీన చరిత్ర, అచట ఉండిన ఇక్ష్వాకులు ఆచార్య నాగార్జునుని చరిత్రను తెలుసుకొంటాడు. నదులకు ఆనకట్టలు కట్టి నీటిని ఎట్లా ఉపయోగించుకోవాలో ప్రత్యక్షంగా చూస్తాడు. ప్రజావసరాలకు ప్రభుత్వ ధనం ఎట్లా ఖర్చు చేయబడుతున్నది, ఎంతమంది ఎన్నాళ్ళు కష్టపడితే దేశాభివృద్ధి ఎట్లా అవుతున్నది గమనిస్తాడు. కేవలం చదివి తెలుసుకొన్న దానికంటే ప్రత్యక్షంగా చూచి తెలుసుకున్నది ఎదుటివారికి సులభంగా వివరించి చెప్పగలడు. క్రొత్త ప్రదేశంలో తను, తనవారు, తమప్రాంతం అనే సంకుచిత భావాన్ని వదిలిపెడతాడు.

ఈ విధంగా విహారయాత్రలు మానవుని మనోల్లాసానికే కాక విజ్ఞానవంతుణ్ణి చేయడానికి ఐక్యత, ఆత్మీయతను కలుగ చేయడానికి ఉపయోగపడుతున్నాయి.

## 7. ఆంధ్ర కేసరి

శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులుగారిని "ఆంధ్రకేసరి" అని ప్రజలు పిలుచుకున్నారు. అది వారి వ్యక్తిత్వానికి చిహ్నం. పంతులుగారు క్రీ. శ. 1872లో నిరుపేద కుటుంబంలో జన్మించారు. బాల్యంలోనే తండ్రి మరణించినందువల్ల తల్లి "ఒంగోలు"లో భోజనాలయాన్ని నడిపి పోషించింది. ఆమె మనోధైర్యమే పంతులుగారిని సింహంగా తయారు చేసింది.

ప్రకాశం పంతులు బాల్యంలో చాలా మొండితనం చేసేవారు. ఆటలు - పాటలు - తిరగడం అలవాటయింది. బాల్యం గడిచే నాటి శ్రీ హనుమంతరావు నాయుడుగారి శిక్షణలో చేరాడు. వకీలు కావాల

పట్టుదలతో శ్రమించి చదివి 1889లో మెట్రిక్ పరీక్ష ప్యాసయినాడు. 1891లో ఎఫ్. ఎ. చదివి మద్రాసు లా కాలేజీలో చేరాడు. అందులో ఉత్తీర్ణుడు కాగానే 'ఒంగోలు'లో వకీలుగా ఉండి గొప్ప పేరుప్రఖ్యాతులు సంపాదించాడు. 1899లో రాజమండ్రి పురపాలక సంఘ సభ్యుడై, అధ్యక్షునిగా ఎన్నికై ప్రజోపయోగ కార్యాలెన్నో నిర్వహించాడు. మిత్రుల సహాయంతో ఇంగ్లండులో "బారిస్టరు" పరీక్ష పాసైనాడు. ఇంగ్లండులోని స్వతంత్ర వాతావరణము ఆయన్ని ప్రభావితుణ్ణి చేసింది. ఆయన మనస్సు భారతదేశ స్వాతంత్ర్యంవైపు ఆకర్షించింది. పంతులుగారు లండనునుండి తిరిగి రాగానే ఆంగ్లప్రభుత్వం గొప్పపదవిని ఆశ చూపింది. కాని పంతులుగారు తిరస్కరించారు.

ప్రకాశం పంతులుగారు మద్రాసులో న్యాయవాదిగా ఉంటూ ఎంతో డబ్బు సంపాదించారు. అంతా త్యాగం చేశారు. ఆయన నిర్భీకతకు, ఆత్మవిశ్వాసానికి, పరిశ్రమకు న్యాయాధీశులు ఆశ్చర్యపోయారు.

రాజకీయంలో ప్రవేశించిన పంతులుగారు వకీలు పని మానుకున్నారు. సహాయ నిరాకరణోద్యమము, ఉప్పు సత్యాగ్రహములో పాల్గొన్నారు. "స్వరాజ్య" పత్రికను స్థాపించి ప్రజలలో దేశభక్తిని, ఆత్మబలాన్ని రేకెత్తించారు.

1927లో సైమన్ కమీషన్‌ను పంతులుగారు మద్రాసులో బహిష్కరించారు. సైనికుల నెదుర్కొన్న పంతులుగారి సాహసానికి ప్రజలు "ఆంధ్రకేసరి"అని పిలుచుకొన్నారు. 1937లో చక్రవర్తి రాజగోపాలాచారిగారి మంత్రిమండలిలో చేరి రైతులకు సహాయం చేశారు. 1942లో "భారత్ ఛోడో" ఆందోళనలో జైలుకు వెళ్ళారు. ఎన్నోరచనలు చేశారు.

1953లో ఆంధ్రరాష్ట్రానికి మొదటి ముఖ్యమంత్రి అయినారు పంతులుగారు. 1956లో ఆంధ్రులంతా కలిసి "ఆంధ్రప్రదేశ్" ఏర్పడ్డ తరువాత హైదరాబాదులోనే ఉంటూ 1957లో పరమపదించారు. జీవితంలో చివరి నిమిషం వరకు 'దేశసేవ' లోనే గడిపిన ప్రకాశం పంతులు గారు మనజాతికి ఆదర్శ దేశభక్తులు. ఆయన సాహసము, నిర్భీకత, అలసటనొందని పరిశ్రమ మనకు ఆదర్శాలు కావాలి.

## 8. ఎన్నికలు

మానవుడు సంఘ జీవితానికి అలవాటుపడ్డ తరువాత సాంఘిక కార్యక్రమాలు నిర్వహించడానికి ఒక నాయకుని ఎన్నుకోవడం ప్రారంభించాడు. అతడే ఆ సమాజానికి అవసరమైన అవసరాలను తీర్చే నాయకుడు. తాను న్యాయంగా నడచుకోవడం, ఇతరులను న్యాయంగా నడపడం అతని బాధ్యతలు.

మనదేశంలో గణరాజ్యాలు ఉండేవని, గణనాయకుడు ఆ సమాజాన్ని నడిపేవాడని చరిత్రకారులు చెపుతారు. ఈ మధ్యయుగంలో రాచరికాలు ఏర్పడి, రాజులు వంశపారంపర్యంగా ప్రజలను పాలించడం జరిగింది. మళ్ళీ శాంతియుత పోరాటం ద్వారా ఇంగ్లీషు వారినుంచి స్వాతంత్ర్యాన్ని పొందిన తరువాత మనదేశానికి ప్రజాపరిపాలన వచ్చింది. వివిధ ప్రాంతాలనుండి ఎన్నుకోబడిన నాయకులు తమకు నాయకునిగా ఒకరిని ఎన్నుకుంటారు. అతడు దేశానికి నాయకుడై కొందరిని చేర్చుకొని మంత్రిమండలిని ఏర్పరుస్తాడు. వారి సహాయంతో అన్నిశాఖలను సరిచూచుకుంటూ ప్రజావసరాలు, దేశాభివృద్ధి సాధిస్తాడు.

ఈ రకంగా ఎన్నికై దేశాభివృద్ధిని చూచే సభకు "పార్లమెంటు" అనిపేరు. రాష్ట్ర అభివృద్ధి కార్యక్రమాలు చేపట్టేది "శాసనసభ". దీని నాయకుణ్ణి "ముఖ్యమంత్రి" అంటారు. జిల్లా పరిపాలనకు "జిల్లా పరిషత్తు", తాలూకాస్థాయి పాలనకు "పంచాయితి సమితి". గ్రామస్థాయిలో "గ్రామపంచాయితి" ఎన్నికల ద్వారా ఏర్పడిన సంస్థలు. పంచాయితి మొదలుకొని పార్లమెంటు వరకు ఉండే నాయకులందరు ప్రజల చేత ఎన్నుకోబడినవారే. పరిపాలనా సౌకర్యం కొరకు ఇన్ని విభాగాలు చేయడం జరిగింది.

ఈ ఎన్నికల విధానం బాల్యం నుండే తెలుసుకోవడానికి విద్యాసంస్థలలో, విద్యార్థి సంఘం ఎన్నికల ద్వారా యువకులకు శిక్షణ ఇవ్వడం జరుగుతున్నది. పాఠశాల విద్యార్థుల అవసరాలను ప్రధానోపాధ్యాయులకు చెప్పి సౌకర్యాలు కలిగేటట్లు చూడడం విద్యార్థి నాయకుల బాధ్యత. అదే విధంగా మంచిప్రవర్తన కలవానిని నాయకునిగా ఎన్నుకొనడం ఉత్తమ పౌరుని విధి.

నాయకుని ఎన్నుకునే పద్ధతికి 'ఓటు'అని పేరు. * అంటే మన సమ్మతిని తెలపడం అన్నమాట. ఒక్కొక్కసారి నాయకుణ్ణి ఆలోచన లేకుండా ఎన్నుకుంటే బాధపడవలసి వస్తుంది. మంచికార్యదక్షుణ్ణి ఎన్నుకొనే బాధ్యత, అతని ద్వారా సమాజాభివృద్ధి సాధించడము ఈ ఎన్నికల ప్రయోజనము.

---

* 21 సంవత్సరాలు పైబడిన వారందరు మనదేశంలో ఓటు చేయటానికి అర్హులు.

కింది శీర్షికలపైన కూడా వ్యాసాలు వ్రాయటానికి అభ్యాసం చేయండి.

1. జాతీయ పర్వదినాలు
2. జాతీయ సమైక్యత
3. మాతృభాషలో విద్యాబోధన
4. మన రాజ్యాంగము

—: o :—